**SRINIVASA BALABHARATI -86**
***(Children Series)***

## KARNUDU

*By*

***Sri D. RAGHUNATHACHARYULU***

T.T.D.Religious Publications Series No.: 941



First Edition : 2015

Copies :

*Published by*

**Dr. D. SAMBASIVA RAO I.A.S.,**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*D.T.P. :*

Editor-in-Chief Office, TTD, Tirupati.

*Printed at:*
Tirumala Tirupati Devasthanams Press,Tirupati.

**శ్రీనివాస బాలభారతి - 86**

# కర్ణుడు

రచన

**శ్రీ డి. రఘునాథాచార్యులు**

ప్రచురణ

**తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి**

**2015**

## ముందుమాట

చిన్నపిల్లల మనసులు చల్లనైనవి, నిర్మలమైనవి. చక్కగా పెరిగిన పిల్లలు భావిభారత పౌరులై మంచి సభ్యత సంస్కారం పెంచుకొని, తమ కుటుంబానికి, దేశానికి కూడ పేరుప్రతిష్ఠలను సంపాదించి గర్వకారణమౌతారు. మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహాపతివ్రతలు ఎలాంటివారు, వారంత గొప్పవారెలా అయినారనే విషయం, వారికథలు చెపుతూ పిల్లలకు తెలియజేయగలిగితే, వాటి ప్రభావం లేతమనస్సులపైన చక్కని సంస్కారముద్రలను వేయగలుగుతుంది. అవి భవిష్యత్తులో వారికెంతగానో ఉపయోగపడతాయి.

ఈ ఉద్దేశ్యంతోనే ''శ్రీనివాస బాలభారతి'' అనే పుస్తకమాలను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రచురిస్తోంది. ఇందులో మన భారతదేశంలో అనేక ఆదర్శాలలో ప్రసిద్ధులైన మహాత్ముల చరిత్రలు చిన్న చిన్నవాక్యాలలో చక్కని కథాకథన పద్ధతిలో చెప్పడం జరుగుతుంది. చిన్నారి బాలలు వీటిని బాగా ఉపయోగించుకుంటారని ఆశిస్తున్నాం.



కీ.శే.డా॥ ఎస్.బి.రఘునాథాచార్యగారు రూపొందించిన ఈ ప్రణాళికను కొనసాగిస్తూ అదే శీర్షికన చాలా పుస్తకాలను ప్రచురింపజేయటంతోపాటు వాటిని హిందీ, ఆంగ్లం మున్నగు ఇతర భాషల్లోనికి అనువదింపజేస్తున్న ప్రచురణలవిభాగం ముఖ్యసంపాదకులు అభినందనీయులు. ఈ ప్రణాళికలో సహకరించిన రచయితలకు, కళాకారులకు మా ధన్యవాదాలు.

**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు,
తిరుపతి.

## ఒక్క మాట

చిన్నపిల్లల్లో ధార్మిక జ్ఞానాన్ని కల్గించాలని, బాల్యంలో కల్గిన జ్ఞానం జీవితాంతం వారికి ఉపకరిస్తుందనే ఉద్దేశ్యంతో తిరుమల తిరుపతి దేవస్థానం ఈ 'శ్రీనివాస బాలభారతి' పథకాన్ని ప్రారంభించింది. దీనికి అప్పట్లో ప్రధాన సంపాదకులుగా ఉండిన ప్రముఖ పండితులు, రచయితలు, మాజీ ఉపకులపతి డా॥యస్.బి.రఘునాథాచార్యులవారు ఈ గ్రంథాలను పరిష్కరించి తీర్చిదిద్దారు. వీరి నేతృత్వంలో కొన్ని వేల ప్రతులను చిన్న పిల్లలకు అందించడం జరిగింది.

మన ఇతిహాసాల్లోని మహాపురుషులు, మహా పతివ్రతలు, మహావీరులు భారతీయ సంస్కృతికి చక్కని పునాదులు.వారి జీవిత గాథల్ని సరళ సుందరశైలిలో, అందమైన ముద్రణతో వెలుగులోకి తేవడం జరిగింది. ప్రస్తుతం ఆ పుస్తకాలతో పాటు మరికొన్నింటిని కొత్తగా చేర్చి దేవస్థానం ముద్రించింది. భావి భారత పౌరులైన పిల్లలకు ధార్మిక సాహిత్య పరిచయం కల్గించాలనే సత్సంకల్పంతో తి.తి.దే. వీటిని అందిస్తోంది.



తల్లిదండ్రులే పిల్లలకు ప్రథమ గురువులు. కనుక వారు కూడా ఈ 'శ్రీనివాస బాలభారతి' రచనలను ఆదరించి, పఠించి వాటి ప్రాముఖ్యమును పిల్లలకు తెలియచేసి వారిచేత చదివించాలి. అప్పుడే ఆ బిడ్డలు అందరూ ఆదర్శ వంతులుగా తీర్చిదిద్దబడతారనడంలో సందేహం లేదు. నేటి మొక్కలే రేపటి వృక్షాలు కనుక ఇప్పటినుండి పిల్లలలో నైతికములైన విలువలను, ఆధ్యాత్మిక చింతనను పెద్దలు అలవాటుచేస్తే భవిష్యత్తులో ఉత్తమ పౌరులుగా వెలుగొందుతూ ఆదర్శజీవితం సాగించగలరు. ఆ ఈ సంకల్పానికి ఈ బాలభారతి గ్రంథాలు చేయూతనివ్వగలవని మా విశ్వాసం.

ముఖ్య సంపాదకులు

# కర్ణుడు

యాదవరాజైన శూరుడనేవానికి పలువురు కుమార్తె లుండేవారు. వారిలో కుంతి పెద్ద కూతురు. శూరుని మేనత్తకొడుకైన కుంతిభోజునికి సంతానం లేదు. అందుచేత కుంతిని పెంచుకున్నాడు. కుంతి యౌవనవతిగా కన్యగా ఉన్నప్పుడు ముక్కోపియైన దుర్వాసుడనే మహర్షి కుంతిభోజుని యింటికి వచ్చి ఒక సంవత్సరకాలం తానక్కడ గడుపగోరు తున్నానని తనకెట్టి లోటు లేకుండా యేర్పాటు చేయగలవా అని కుంతిభోజుణ్ణి అడిగాడు. కుంతిభోజుడు అందుకంగీ కరించి తన దత్తపుత్రికయైన కుంతిని దుర్వాస మహర్షి సేవకోసం ప్రత్యేకంగా నియమించాడు. కుంతి మిక్కిలి వినయ విధేయతలతో, భయభక్తులతో దుర్వాసమహర్షికి అసౌకర్యం కలుగకుండా సపర్యలు చేసింది. ఆమె సేవలకు, ఓర్పునకు మెచ్చిన దుర్వాసమహర్షి ఆమెకొక మంత్రం ఉపదేశించి



వెళ్ళాడు. ఆ మంత్రం జపించి ఏ దేవుణ్ణి తలిస్తే ఆ దేవుడు ఆమెకు వశమౌతాడు.

## మంత్ర ప్రభావం తెలుసుకోవాలని :

కొంతకాలం గడచిన తరువాత ఒకనాడు కుంతి గంగానదికి స్నానానికి వెళ్ళి, స్నానానంతరం ఉదయసూర్యునికి అర్ఘ్యం యిస్తూ ఆ బింబ సౌందర్యానికి ముగ్ధురాలైంది. పూర్వం దుర్వాసమహర్షి తనకు నేర్పిన మంత్ర విషయం జ్ఞప్తికి రాగా, దాని ప్రభావం తెలుసుకోవాలనుకున్నది. ఆ మంత్రాన్ని జపించి తన మనస్సులో సూర్యభగవానుణ్ణి తలచింది. వెంటనే సూర్య భగవానుడు ధగధగ మెరసిపోయే సుందర పురుషుని రూపంలో ప్రత్యక్షమై ''కుంతీ! నీ మంత్రబలంవల్లనే నేను వచ్చాను. నేను నీ అధీనుణ్ణి. నీ కిష్టమైతే నిశ్చయంగా చెప్పు. నీకు సంతోషాన్ని కలిగిస్తాను'' అన్నాడు. అప్పుడు కుంతి అతనితో ఇలా అన్నది- ''సూర్యదేవా! నీ సుందరబింబ దర్శనం చేస్తూ నా మంత్ర



మహిమను తెలుసుకోగోరి మంత్రాన్ని ఉచ్చరించానే కాని నాకు వేరొక ఉద్దేశ్యం లేదు. కాబట్టి నీవు నాయందు దయజూపి శీఘ్రంగా ఆకాశానికి మరలి వెళ్ళు''.

## నీకు తెలియని ధర్మం లేదు :

అందుకు సూర్యు డాగ్రహించి ''నీవింతకు ముందే మనస్సులో నాతో సమాన తేజోవంతుడైన సహజ కవచ కుండలాలుగల పుత్రుణ్ణి కోరుకున్నావు. మంత్రశక్తిని మీరటానికి నాకూ శక్తి లేదు. నీవిందు కంగీకరింపకపోతే నీ తల్లిదండ్రుల్ని, నీకు మంత్రంనేర్పిన దుర్వాసమహర్షిని కూడా నా వాడి కిరణాలతో భస్మం చేస్తా'' నన్నాడు. తన కులానికి, గురుజనానికి తనవల్ల అపాయం సంభవిస్తుందేమోనని కుంతి భయపడింది. సూర్యునితో ''సూర్యదేవా! తల్లిదండ్రులు, బంధువర్గము కలసి సంతోషపూర్వకంగా, ధర్మప్రకారం స్త్రీలకు పెండ్లి చేయాలి. అలా పెళ్ళయిన పిమ్మటే స్త్రీలు కామసుఖాన్ని అనుభవించాలి. వివాహం కాకపూర్వం స్త్రీలు పరపురుషులతో

సౌఖ్యాలు అనుభవింపకూడదు. ఈ లోకంలోని సత్యధర్మాలు నీ స్వరూపాలే! నీకు తెలియని ధర్మమంటూ లేదు. నీకు ధర్మమని తోచిన విధంగా చెయ్యి" అన్నది. అంతట సూర్యుడు "నీకు కన్యాత్వం చెడకుండా మహాతేజోవంతుడైన పుత్రుణ్ణి ప్రసాదిస్తా" నని కుంతిని సంతోషపరచి ఆకాశానికి వెళ్ళిపోయాడు.

## సహస్రకవచుడే :

సూర్యుని అనుగ్రహం చేత కుంతి గర్భం ధరించి నవమాసాలు మోసింది. కాని సూర్యదేవుని మహిమవల్ల ఇతరులకు ఆమె గర్భం కనపడకుండా ఉండేది. పదోనెలలో ఒకనాటి రాత్రి కన్యాంతఃపురంలో కుంతి ఒక మగశిశువును కన్నది. ఆ పిల్లవాడు పుట్టుకతోనే బంగారు కవచకుండలాలు కలిగివున్నాడు. ఈ బాలుడు పూర్వజన్మలో సహస్రకవచుడనే వాడు. వానికి వేయి కవచాలుండేవి. ఒక్కటి మినహా మిగిలిన





కవచాలనన్నింటిని నర నారాయణులు భేదించారు. మిగిలిన ఒక్క కవచంతో ఇతడు పుట్టాడు. ఇతణ్ణి చంపటానికే నరనారాయణులు కృష్ణార్జునులుగా అవతరించారు.

## నదీప్రవాహంలో :

కుంతి తన కొడుకును చూచి సంతోషించింది. కాని లోకాపవాద భయంతో తల్లడిల్లి ఆ క్షణంలోనే ఒక చెక్కపెట్టెను తెప్పించి, దానిలో మెత్తని ప్రక్క ఏర్పరచి, దానిపై ఆ పసికందును పదిలంగా పడుకోబెట్టింది. తన బిడ్డ దొరకినవారు ఏలోటు లేకుండా వాణ్ణి పెంచటానికి ఆ పెట్టెలో ఒక వైపు నవరత్నాలహారాలుంచింది. ఆ పెట్టెను తన చెలికత్తెతో కలసి ఒక తెప్పకు భద్రంగా బంధించి విడువలేక విడువలేక దానిని అశ్వనదీ ప్రవాహంలోనికి విడిచి పెట్టి రహస్యంగా తన కన్యాంతఃపురానికి వచ్చి ఎప్పటిలాగా కన్యగా కాలం గడుపుతున్నది.



## దేవుడిచ్చిన బిడ్డ :

ఆ పెట్టె అశ్వనదినుంచి తరలివెళ్ళి గంగానదిలోకి ప్రవేశించింది. అది పోయిపోయి చివరకు సూతదేశంలోని 'పంపా" పట్టణం దగ్గరకు చేరింది. ఆ సమయానికి ఆ నదిలో స్నానం చేస్తున్న అతిరథుడు, అతని భార్య రాధ కలసి ఆ పెట్టెను ఒడ్డుకుచేర్చి, తెరచేటప్పటికి అందులో సూర్యునిలాగా ప్రకాశిస్తున్న ఒక బిడ్డ కనిపించాడు. సంతానంలేని ఆ దంపతులు అతనిని తమకు భగవంతుడిచ్చిన బిడ్డగా ఎంచి తెచ్చి ప్రేమగా పెంచుకోసాగారు. సహజ కుండల భూషితుడు కాబట్టి వాడికి కర్ణుడని పేరు పెట్టారు. సువర్ణ మయమైన సహజకవచం కలిగినవాడు కాబట్టి వసుసేనుడని, రాధ పెంచిన బిడ్డ కాబట్టి రాధేయుడని కూడా అతనిని పిలిచేవారు.

## లోలోపలే కుమిలిపోయాడు :

కర్ణుని పెంచుకొనే అతిరథుడు దుర్యోధనుడికి అతిసన్నిహితుడైన సూతుడు. అందుచేత కౌరవపాండవులతో

పాటు కర్ణుడు కూడా ద్రోణాచార్యులవద్ద సమస్త యుద్ధవిద్యలు అభ్యసిస్తూ వుండేవాడు. విలువిద్యలో తనకంటే అధికుడైన అర్జునుణ్ణి ద్రోణాదులెక్కువగా అభిమానించటం చూచి కర్ణుడు మిక్కిలి రోషం పొందినా కూడ, తాను తక్కువ కులం వాడినను కోవడం చేత లోలోపలే విచారంతోను, అవమానంతోను కుమిలి పోతుండేవాడు.

### విలువిద్యా కౌశల ప్రదర్శన :

ఇలా చాలా రోజులు గడిచాయి. ఒక రోజున కురుపాండవ కుమారుల శస్త్రాస్త్రవిద్యాకౌశల ప్రదర్శన యేర్పాటు చేయబడింది. అందులో అర్జునుని విలువిద్యాశక్తికి దీటుగా కర్ణుడు కూడా విలువిద్యాకౌశలం ప్రదర్శించి దుర్యోధనాదుల పొగడ్తలందుకున్నాడు. అర్జునుణ్ణి యెదిరింప గల శక్తిమంతుడైన కర్ణుణ్ణి తన ప్రియమిత్రునిగా దుర్యోధనుడు పరిగణింపసాగాడు. భీష్మధృతరాష్ట్రాదులు కౌరవపాండవ కుమారుల అస్త్రవిద్యల్ని చూచి మెచ్చుకొనేవారేగాని కర్ణుణ్ణి పలుకరించేవారే కాదు.



### నీకు రథసారథ్యమే తగిన పని :

అందుచేత కర్ణుడికి మిక్కిలి రోషం వచ్చి అర్జునుణ్ణి ఆక్షేపిస్తూ, భుజాలు చరుస్తూ తనతో ద్వంద్వయుద్ధం చేయమని సవాలు చేసాడు. అందుకు అర్జునుడు కర్ణుడు సూతపుత్రుడని అట్టివానితో రాజకుమారుడైన తాను ద్వంద్వయుద్ధం చేయనని తిరస్కరించాడు. భీముడు కూడా కర్ణుణ్ణి చూచి "ఓరీ! నీచకుల రాధేయా! అర్జునుణ్ణి గెలిచేది నీవా? నీకు రథసారథ్యమే తగిన పని" అని హేళన చేశాడు. భీమార్జునుల పోటుమాట లకు బాగా బాధపడి కర్ణుడు పాండవులపై పగను పెంచు కున్నాడు. కాని తాను సూత పుత్రుణ్ణేనని కర్ణుడనుకుంటూ వుండటంచేత సమాధానం చెప్పలేక అవమానంతో తలవంచు కున్నాడు. అది చూచి దుర్యోధనుడు వెంటనే కర్ణుణ్ణి అంగ రాజ్యానికి రాజుగా అభిషిక్తుణ్ణి చేసి, అతణ్ణి అవమానం నుంచి కాపాడాడు. దుర్యోధనుడు తనపైన చూపిన ఔదార్యానికి కర్ణుడు సంతోషించి కృతజ్ఞతతో తన శక్తియుక్తుల్నే కాక ప్రాణాన్ని సైతం



మిత్రుడైన దుర్యోధనుడి కోసమై వినియోగిస్తానని శపథం చేశాడు.

### బ్రాహ్మణ వేషంలో కర్ణుడు:

కర్ణుడొకనాడు గురువైన ద్రోణాచార్యులను తనకు బ్రహ్మాస్త్రవిద్య నేర్పమని ప్రార్థించాడు. కాని ద్రోణుడు "నీవు సూతకులం వాడవు. బ్రాహ్మణులకు, ఉత్తమ కులమునకు చెందిన వారికే గాని నీవంటి వారికి బ్రహ్మాస్త్ర విద్య నేర్ప" నన్నాడు. అందుచేత కర్ణుడు తన కోరిక నెరవేర్చుకోవటానికై మార్గాంతరం ఆలోచించి, బ్రాహ్మణ వేషం వేసుకొని, పరశు రాముని నమ్మించి, శిష్యుడుగా చేరి, బ్రహ్మాస్త్రవిద్యతో పాటు భార్గవాస్త్రవిద్య కూడా నేర్చుకున్నాడు.

భార్గవ బ్రహ్మాస్త్ర విద్యలను నేర్చుకున్న కర్ణుణ్ణి తన కుమారుడైన అర్జునుడు జయించటం అసాధ్యమని దేవేంద్రుడు గ్రహించాడు. మాయోపాయంతో కర్ణుడు నేర్చిన



విద్యల్ని వ్యర్థం చేయాలని పూనుకున్నాడు. ఒకనాటి పగలు పరశురాముడు శిష్యుడైన కర్ణునితొడపై తల పెట్టుకొని గాఢనిద్రలో ఉన్న సమయంలో దేవేంద్రుడొక కీటకరూపంలో కర్ణుని తొడ తొలిచి రక్తం ప్రవహింపజేశాడు. గురువుకు నిద్రాభంగం కలుగకూడదని కర్ణుడాబాధను ఓర్చుకున్నాడు. రక్తపు తడి తగిలి మేల్కొన్న పరశురాముడు కర్ణుని మోసాన్ని తెలిసికొని మహాకోపంతో నీవు నేర్చిన విద్య అవసర సమయంలో జ్ఞప్తికి రాకుండా పోవు గాక!" అని శాపమిచ్చాడు. కాని కర్ణుని ప్రార్థనపై "ముందు ముందు రాబోయే కురుపాండవ యుద్ధంలో ఒక్కరోజున మాత్రం నేను నేర్పిన విద్య నీకు హస్తగతమై వుంటుం" దని శాపానుగ్రహం ప్రసాదించాడు.

### వరుస శాపాలు :

కర్ణుడు పరశురామునివద్ద అస్త్రవిద్య నేర్చుకుంటున్న సమయంలో సాధనచేస్తూ బాణం వేయగా అది ఒక

బ్రాహ్మణుని ఆవుదూడకు తగిలి అది చనిపోవుటకు కారణ మైంది. అందుకు ఆ బ్రాహ్మణుడు కోపించి "నా యాగధేనువు దూడను బాణంతో కొట్టి చంపావు, కాబట్టి నీ రథచక్రం యుద్ధభూమిలో క్రుంగిపోయి నీవు చంపగోరిన వాని చేతిలోనే చస్తా"వని శాపమిచ్చాడు. ఆ బ్రాహ్మణ శాపానికి కర్ణుడు మిక్కిలి చింతించాడు.

కర్ణుడు పరశురాముని ఆశ్రమం నుంచి తిరిగి వచ్చిన తరువాత ఒకనాడు శరసాధన చేస్తూ వుండగా నేతిపాత్రతో వెళుతున్న ఒక బ్రాహ్మణ తరుణి కర్ణుని సౌందర్యం చూచి పరవశత్వంతో నడుస్తూ ఒక రాయి తగిలి పడి నెయ్యంతా ఒలకపోసుకుంది. నెయ్యంతా నేలపాలై పోయినందుకు దుఃఖిస్తున్న ఆ బ్రాహ్మణకాంతను చూచి కర్ణుడామె నోదార్చి నెయ్యి ఇంకిన మట్టిని తన భుజబలంతో పిండి ఆమె నేతిని ఆమెకిచ్చి సంతోషింప జేశాడు. తనను కర్ణుడు కఠినంగా పిండి బాధించినందుకు భూదేవి కోపించి "ఓరీ! దుర్మదాంధుడా!



అకారణంగా నన్ను పిండి పీడించి, క్షమాదేవినైన నన్ను బాధించి కోపింపజేశావు, కాబట్టి యుద్ధసమయంలో నీ రథచక్రం పలుసార్లు నాలో క్రుంగిపోవుగాక!" అని కర్ణుణ్ణి శపించింది. ఒకదాని వెంట ఒకటిగా తనకు కలిగిన శాపాలకు కర్ణుడు తన దురదృష్టానికి మిక్కిలి విచారించాడు.

## కర్ణుడంతటివాడా !

**"కృతే యుగే బలిర్దాతా త్రేతాయాం రఘునందనః ।**
**ద్వాపరే సూర్యపుత్రశ్చ కలౌ రాయన భాస్కరః ॥"**

అని నాలుగు యుగాల్లోను దాతృత్వానికి ప్రసిద్ధులైన నలుగురు మహాపురుషులను గూర్చి చెప్పారు. దీనినిబట్టి ద్వాపరయుగంలో సూర్యపుత్రుడైన కర్ణుణ్ణి మించిన దాత ఇంకొకడు లేడని తెలుస్తుంది. కర్ణుని పేరు వినగానే దానగుణం జ్ఞాపకానికి వస్తుంది. నిత్యం తనను యాచించ డానికి వచ్చే యాచకుల కోరికలెటువంటివైనా తీర్చటం కర్ణుని



వ్రతం. యాచకులు తనను దర్శించటానికేమైనా ఆటంకం యేర్పడవచ్చని తలచి కర్ణుడొక గంటను తన భవనం ముందు వ్రేలాడగట్టాడు. యాచకుడెవడైనా, ఏ సమయంలోనైనా ఆ గంటను నిరాటంకంగా మ్రోగించవచ్చు. అది విన్న వెంటనే కర్ణుడు ఎటువంటి స్థితిలో వున్నప్పటికి, ఆ యాచకుని పిలిపించి, వాని కోరిక నెఱవేర్చి పంపుతుండేవాడు.

ఒకానొక సమయంలో కుంతీదేవితో సంభాషణ సందర్భంలో, శత్రు పక్షంలోని కర్ణుణ్ణి గూర్చి భయపడు తున్నానని కృష్ణుడు పలికాడు. అది విన్న విదురుడాశ్చర్యంతో "కర్ణుడంతటి వాడా!" అని కృష్ణుణ్ణి అడిగాడు. అది విని కృష్ణుడు "విదురా! ఆ కర్ణుడు సామాన్యుడు కాడు. అతని దానగుణం లోక ప్రసిద్ధమైంది. గోబ్రాహ్మణప్రీతి కలిగించినందువల్ల దేవతలాతనిపై అనుగ్రహంతో వున్నారు. అట్టివానిని జయించటం అసాధ్యమైన పని" అని చెప్పాడు.



విదురుని సందేహాన్ని తీర్చటానికై కృష్ణుడు తనతో పాటు విదురుని సాధువేషంలో కర్ణునివద్దకు తీసుకువెళ్ళాడు. కర్ణుడు వారిని నమస్కార పూర్వకంగా ఆహ్వానించి వచ్చిన కార్యమేమిటని అడిగాడు. "మేము సత్రయాగం చేయదలచాం. దానికి కావలసిన ఎండు కట్టెపుల్లలు నిరంతర వర్షంవల్ల మాకు లభించలేదు. పదిబండ్ల పొడికట్టెలు దానమిప్పించండి" అని సాధువేషంలో వున్న కృష్ణవిదురులు కోరారు. కర్ణుడు దీర్ఘాలోచన చేసిన పిమ్మట చందనపు కలపతో కట్టిన తన గృహాన్ని కూలవేసి ఆ కలప బండ్లకెత్తించి వారికి దానం చేశాడు. అది చూసిన వారందరు కర్ణుని దానవ్రతనిష్ఠకు ఎంతో మెచ్చుకున్నారు.

## దానకర్ణుడనే కీర్తి చాలు :

కౌరవపాండవులకు జరగబోయే యుద్ధంలో సహజకవచకుండలాలుకల కర్ణుడు దుర్యోధనుని పక్షంలో

ఉండటం కుంతికి చాలా భయాన్ని కలిగించింది. అందుచేత ఆమె దుర్వాసమహర్షి ఉపదేశించిన మంత్రాన్ని స్మరించి దేవేంద్రుణ్ణి ప్రత్యక్షం చేసుకొని "నీ వరపుత్రుడైన అర్జునుడికి అపాయం లేకుండా ఉండే ఉపాయం వెదక'' మని ప్రార్థించింది. అప్పుడు దేవేంద్రుడిలా అన్నాడు ''భయపడకు! దానవ్రతమంటే కర్ణుడికి ప్రీతి ఎక్కువ. బ్రాహ్మణ రూపంలో అతణ్ణి యాచించి కవచకుండలాల నపహరిస్తాను.''

ఇదంతా చూస్తున్న సూర్యుడు తన వరపుత్రుడైన కర్ణుణ్ణి కాపాడుకోదలచి బ్రాహ్మణరూపంలో కర్ణుని దగ్గఱకు వచ్చి ''కుమారా! దురాత్ముడైన దేవేంద్రుడు తన కుమారుడైన అర్జునుణ్ణి కాపాడుకోదలచి, కపటబ్రాహ్మణ వేషంలో నీ కవచకుండలాలు అర్థించి, నిన్ను నిర్వీర్యుణ్ణి చేయాలను కుంటున్నాడు. ఆ మోసంలో నీవు పడకుండా హెచ్చరిస్తున్నాను'' అన్నాడు.



అందుకు కర్ణుడు ''త్రిలోకాధిపతి దేవేంద్రుడంతటి వాడు నన్ను చేయిచాచి యాచించటం కన్న నాకీ జన్మకు కృతార్థత వేరే ఏముంటుంది? నాకు ప్రాణాంతకమైనా సరే! ఇంద్రుడే నన్నర్థించటానికి వస్తే కవచకుండలాలే కాదు, నా ప్రాణమైనా సరే ఇస్తాను. వీరభోజ్యమైన యుద్ధవిజయం కన్నా శాశ్వతమైన 'దానకర్ణు'డనే కీర్తి నార్జిస్తాను. నీ మాట నిరాకరించానని కోపించకుండా నీవు వెలుగుతున్నంత వరకు నా కీర్తి వెలుగుతుండేటట్లు నన్నునుగ్రహింప వేడుకుంటున్నా'' నన్నాడు. సూర్యుడు కర్ణుని దానవ్రతదీక్షకు ఆశ్చర్యపడి అలాగేనని ఆశీర్వదించి, దేవేంద్రుని వద్ద నున్న ''శక్తి'' అనే అస్త్రాన్ని కోరమని చెప్పి మాయమైపోయాడు.

## 'శక్తి' అనే అస్త్రాన్ని తీసుకో :

సూర్యుడు చెప్పినట్లుగానే దేవేంద్రుడు వృద్ధ బ్రాహ్మణ వేషంలో కర్ణుడు సూర్యోపాసన చేసే సమయంలో వచ్చి



''కీర్తిశాలీ! నీకు నా ఆశీర్వాదాలు'' అన్నాడు. కర్ణుడు నమస్కారం చేస్తూ ఆహ్వానించి'' ''మహాత్మా! మీరేపనిమీద ఇక్కడకు దయచేశారు? చెప్పండి'' అన్నాడు. ''నాయనా! నాకేమీ వద్దు. నీ కవచకుండలాలను కోరి వచ్చాను. నాకు వాటినిచ్చి శాశ్వత కీర్తిని పొంద'' మని బ్రాహ్మణరూపంలో వున్న దేవేంద్రుడు పలికాడు. సూర్యుని పలుకులు జ్ఞప్తికి రాగా వచ్చిన బ్రాహ్మణుడు దేవేంద్రుడేయని కర్ణుడు గ్రహించాడు. ''ఆర్యా! బ్రాహ్మణ వేషంలో వచ్చి నన్ను మోసగించటం నీకు ధర్మం కాదన్నాడు. ఇంద్రుడది విని ''ఓయీ కర్ణా! నీవు దాన, సత్య నిష్ఠగల వాడివని నమ్మి నేను వచ్చాను. వ్రతభంగం చేయటం నీకు ధర్మం కా''దన్నాడు. అది విని కర్ణుడు మారు మాట్లాడక తన కవచకుండలాలను తానే స్వయంగా కోసి దేవేంద్రుడికి దానం చేసాడు. ఇంద్రుడు చేయబోయే మోసాన్ని ముందుగానే తెలిసివుండి కూడా తన ప్రాణాపాయాన్ని సైతం లెక్కచేయక, స్వశరీర భాగాన్ని కోసి యివ్వటానికి సాహసించిన కర్ణుడి



ఔదార్యం పూర్వపు శిబి, దధీచుల త్యాగాన్ని తలపింపజేస్తుంది. ఇంద్రుడు కవచకుండలాల దానాన్ని తీసికొని సిగ్గుతో ''ఓ త్యాగశీలీ! కర్ణా! నీ మహిమ తెలియక ముల్లోకాధిపతినై వుండి కూడా నిన్ను మోసం చేయటానికి పూనుకున్నాను. అందుచేత నేను మిక్కిలి నిందింపదగిన వాడినైనాను. కేవల కీర్తికాంక్షతో ప్రాణరక్షకాలైన కవచకుండలాలను దానంచేసిన నీవంటివాడు ముందు కాలంలో కలుగబోడు. నీ కీర్తి కాంతి ఆచంద్రార్కం వెలుగొందుగాక! నీ దానానికి మారుగ ఎంతటి వీరుడి ప్రాణమునయినా హరించుటకు సమర్థమైన 'శక్తి' అనే యీ ఆయుధాన్ని తీసుకో'' అని చెప్పి కర్ణునికిచ్చి అంతర్ధానమైనాడు.

## అధర్మానికి ఒడిగట్టలేను :

ఉత్తమధర్మగుణాల్లో దానగుణం గొప్పదంటారు. తనకున్నదాన్ని ప్రతిఫలాపేక్ష లేకుండా యితరులకివ్వటం దానం. కాని త్యాగమనే గుణం దానం కన్నా దొడ్డది. తనకున్న దాన్ని యితరులకిచ్చే దానగుణం కంటె స్వార్థాన్ని విడచి, తన

ప్రాణాల్నిసైతం విడవటానికి సిద్ధపడటమే త్యాగమంటారు. ఇటువంటి త్యాగశీలం కల వాళ్ళలో కర్ణుడు ప్రథమగణ్యుడు.

కౌరవపాండవయుద్ధం నిశ్చయమైంది. కర్ణుడి జన్మరహస్యం, శక్తి సామర్థ్యాలు తెలిసిన కృష్ణుడు తన రాయబారం విఫలమైన పిమ్మట రహస్యంగా కర్ణుని తనవెంటగొనిపోయి "ఓయి! కర్ణా! నీవు కుంతి పెద్ద కొడుకువి. కాబట్టి నీవు పాండవపక్షంలో చేరితే పాండవులు తమరాజ్యానికి నిన్నే పట్టాభిషిక్తుణ్ణి చేస్తారు. సౌందర్యవతియైన ద్రౌపది నిన్ను ఆరవ భర్తగా స్వీకరిస్తుంది. మహావీరులైన పాండవులు నీకు విధేయులై సేవలు చేస్తుంటారు. కాబట్టి పాండవపక్షంలోకి రమ్మని ఆశపెట్టాడు. జరుగబోయే యుద్ధంలో ధర్మబద్ధులైన పాండవులే తప్పక గెలుస్తారనే విషయం కర్ణుడికి బాగా తెలుసు. సామంతరాజుగా వున్న తనకు హఠాత్తుగా చక్రవర్తిపదవి లభించటానికి సంసిద్ధమైంది. స్వయంవర సమయంలో తనను వివాహమాడటానికి తిరస్కరించిన ద్రౌపది యిపుడు తనను



వరింపనుంది. ఇతరులెవరైనా ఇట్టి అవకాశాన్ని వదులుకో గలరా? కాంతాకనకాలపై ఆశలేని వారెవ్వరు? అట్టి ఆశలేని వాడొక్క కర్ణుడే! తన శక్తిపై గొప్ప ఆశ పెట్టుకొనివున్న తన ప్రాణమిత్రుడైన దుర్యోధనుని, పెంచి పెద్దచేసిన రాధాసూతు లను విశ్వాసం విడిచి రావటానికి కర్ణుడి మనస్సు అంగీకరించ లేదు. అందుచేత కర్ణుడు దుర్యోధన, రాధాసూతు లందరి కృతజ్ఞతాభావంతో, ధర్మబుద్ధితో చేజిక్కిన కాంతాకనకాలను కూడా తృణప్రాయంగా తిరస్కరించాడు. సవినయంగానే తానట్టి అధర్మానికి లోబడలేనని చెప్పి కృష్ణుణ్ణి సాగనంపాడు. ఇంతకంటె స్వార్థత్యాగం, నిర్మోహత్వం మరేముంటుంది? నిజంగా కర్ణుడు సాటిలేని త్యాగశీలి! నిర్మోహశాలి!

## నీకెక్కడిది పుత్రప్రేమ?

కౌరవ పాండవ యుద్ధం సమీపించింది. కర్ణుని చేతిలో పాండవులకు మరణం కలుగుతుందేమోనని కుంతి భయపడి కర్ణుణ్ణి పాండవపక్షానికి త్రిప్పాలని గంగాతీరంలో



శుచియై సూర్యోపాసన చేస్తున్న కర్ణుణ్ణి సమీపించింది. తన ప్రత్యర్థి పార్థుని తల్లి కుంతి తనవద్దకు వచ్చినందుకు కర్ణుడాశ్చర్యపడ్డాడు. కుంతి కన్నీరుమున్నీరుగా దుఃఖిస్తూ "కుమారా! నా ప్రథమ కుమారుడవైన నీవే నిజమైన పాండవాగ్రజుడవు. ఈ విషయం ప్రత్యక్షదైవం సూర్యదేవునితో నిజమని చెప్పిస్తాను. నీ కన్నతల్లినైన నన్ను, నీ సోదరులైన పాండవుల్ని ప్రేమతోచేరి యీ కౌరవ రాజ్యానికి చక్రవర్తివై సర్వభోగాలను పొందు" మని బోధించింది.

కుంతి కోరికను విని కర్ణుడామెతో "నెత్తురుగుడ్డుగా ఉన్న నామీద దయలేక గంగకర్పించిన కఠినహృదయురాలవైన నీవు నా జన్మహక్కును జలాలపాలు చేసి, నిర్మల సోదర ప్రేమను గర్భశత్రుత్వంగా మార్చావు. రాజపుత్రుణ్ణి సూత పుత్రునిగా చేసావు. కన్నకొడుకును గంగ కర్పించిన నీకు పుత్ర ప్రేమయెక్కడిది? ఇప్పుడు పాండుపుత్రుడనని నీవెంట రావటంచేత నాకు అధిక మర్యాద రాదు సరిగదా 'పార్థుడికి



భయపడి కర్ణుడే నీచానికి ఒడిగట్టాడ'ని లోకులు నిందిస్తారు. పోయిన నా కులగౌరవ మీ కక్కుర్తి పనిచేత రాదు గదా!

## నీ వ్యర్థ ప్రయత్నం విడిచిపెట్టు!

కృతజ్ఞతాభావంతో నిండిన హృదయంతో కర్ణుడు కుంతితో యింకా ఇలా అన్నాడు. "అంతేగాక నేనీ శరీరాన్ని మిత్రుడైన సుయోధనునకేనాడో సమర్పించాను. దీనియందు నాకే అధికారం లేదు. సుయోధనుడికన్న నా సోదరులు, తల్లి కూడా నాకు ఎక్కువ కారు. నీవు నన్ను గంగకర్పించింది మొదలుకొని నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసి, నన్నెంతో ప్రేమతో చూచే నా పెంపుడు తల్లిదండ్రుల్ని విశ్వాసహీనుడనై విడిచిపెట్టి, లోకులంతా నన్నెగతాళి చేస్తుండగా సిగ్గులేక నేటికి నేనొక రాజకుమారుణ్ణని బయలుదేరటానికి నా అంతరాత్మ ఒప్పుకోవటం లేదు. నేను కుంతీపుత్రుడనని నీవెవ్వరికి చెప్పవద్దు. సూతపుత్రుడ ననిపించుకోవటమే నాకిప్పుడు

గౌరవప్రదం. నీ కడుపున పుట్టినందుకు నీపై భక్తి విడువను. నిన్ను మఱువను. నీకు నా వినయపూర్వక నమస్కారాలు. ఇక నీ వ్యర్థప్రయత్నం విడిచిపెట్టి వెళ్ళమ్మా" అన్నాడు. అది విని కుంతి "కుమారా! నేనిక పుత్రశోకం అనుభవించాల్సిందేనా? నీవు నా దారికి రావా?" అని యెంతో దుఃఖించింది. అది విని కర్ణుడు "యుద్ధంలో నేను అర్జునుణ్ణి చంపితే నాతో కలిపి పాండవులు ఐదుగురు. ఈ కర్ణుడే చస్తే అర్జునుడితో కలిపి పాండవులు ఐదుగురు అవుతారు. అంతేగాక యుద్ధంలో అర్జునుణ్ణి తప్ప తక్కిన పాండవుల్ని నా చేతికి చిక్కినా చంపను. ఇది నీకు నా వాగ్దానం. ఇంక చాలునా? ఇకనైనా వెళ్ళమ్మా!" అని ప్రార్థించాడు. కుంతి చేయగలిగింది లేక విచారభారంతో తిరిగి వెళ్ళిపోయింది.

## కర్ణుని శపథం !

కురుపాండవ యుద్ధారంభంలో కౌరవ సర్వసైన్యాధిపతియైన భీష్ముడు కర్ణుని అర్ధరథునిగా నిర్ణయించినందుకు



కర్ణుడు మిక్కిలి కోపించి "భీష్ముడు సర్వసైన్యాధిపతియై వున్నంతవరకు నేను యుద్ధం చేయ"నని శపథం చేశాడు. ఆ ప్రకారమే భీష్ముడు సైన్యాధిపతిగా యుద్ధంచేసిన పదిరోజులు కర్ణుడాయుధం ధరించలేదు. భీష్ముడు అంపశయ్యనలంకరించిన తరువాత ద్రోణుడు సర్వసైన్యాధిపతియై ఐదురోజులు యుద్ధం చేసి మరణించిన తరువాత దుర్యోధనుడు కర్ణుణ్ణి సర్వ సైన్యాధిపతిని చేశాడు.

కర్ణుడు కౌరవసైన్యాన్ని ఉత్సాహపరుస్తూ మకర వ్యూహం పన్నాడు. అతని ఆధిపత్యంలో మొదటి రోజున జరిగిన యుద్ధంలో కర్ణుడు అపర సూర్యుని వలె ప్రకాశిస్తూ యుద్ధరంగంలో తనను యెదిరించగల వీరు డెవ్వడును లేనట్లు ప్రచండయుద్ధం చేశాడు. తన్నెదిర్చిన పాండవ సైన్యాన్ని అధికసంఖ్యలో సంహరించాడు. నకులుడు కర్ణు నెదిరించగా కర్ణుడు అతని రథం విరగగొట్టి అవమానించి విడిచాడు. కర్ణుడి క్రూర బాణాల తాకిడికి పాండవసైన్యంలోని ఏనుగుల



సమూహం కకావికలమై చెదరిపోయింది. కర్ణుడు పాంచాల సైన్యం మీదికి పోయి శరపరంపర కురిపించాడు. ఆ కర్ణుని బాణపు దెబ్బలకు పాండవసైన్యంలోని రథసారథులు చచ్చారు. ధ్వజాలు తునాతునకలై, గుఱ్ఱాలు కుప్పలై నేలకూలినై. ఏనుగుల కుంభస్థలాలు బ్రద్దలై పోయినై. తుండాలు ముక్కలు ముక్కలుగా పడినై. ఈ ప్రకారంగా కర్ణుడు తన తీక్ష్ణ బాణపరంపరతో పాండవ చతురంగ బలాల్ని చెల్లాచెదరు చేసి సైనికుల్ని, వీరుల్ని చీల్చి చెండాడాడు.

## ఆయుధ ప్రయోగం :

ఈ విధంగా వీరవిహారం చేస్తున్న కర్ణుణ్ణి భీముని పుత్రుడైన ఘటోత్కచుడనే రాక్షస వీరు డెదిర్చి తన మాయా జాలంతో ఘోరంగా హింసించాడు. వాని బారినుండి రక్షించుకోవటానికై తప్పనిసరై కర్ణుడు తనకు దేవేంద్రుడి చ్చిన 'శక్తి' అనే గొప్ప ఆయుధాన్ని ఘటోత్కచునిపై ప్రయోగించి వాణ్ణి నేల గూల్చాడు. కర్ణుడి వద్దవున్న శక్త్యాయుధాన్ని చూచి



అంతవరకూ భయపడుతున్న కృష్ణార్జునులు దాన్ని కర్ణుడుపయోగపరచటంతో భయం వీడి ఉత్సాహంతో యుద్ధం చేయసాగారు.

అర్జునుడు విజృంభించి కర్ణుని కొడుకైన వృషసేనుణ్ణి యెదిర్చి, తన కుమారుడైన అభిమన్యుని మరణానికి కారకుడైన కర్ణునిపై ప్రతీకారం తీర్చుకోవాలని పట్టుదల వహించి, వృషసేనుణ్ణి సంహరించాడు. ఆ సమయంలోనే దుశ్శాసనుణ్ణి భీముడు నేలపడగొట్టి, తన శపథం నెఱవేరేటట్లు దుశ్శాసనుడి రొమ్ము చీల్చి, వేడి నెత్తురు తనివితీరా త్రాగాడు. ధీరుడైన కర్ణుడు పుత్రశోకం అనుభవిస్తూ కూడా తనమిత్రుడైన సుయోధనుణ్ణి సోదరమరణ దుఃఖితుణ్ణి ఓదార్చి "రారాజా! సుయోధనా! ఇక యెట్టి దుఃఖము లేదు. పరాజయమును లేదు. ఈ కర్ణుడంటే యెవ్వడో సమస్త పాండవసైన్యానికి నేడు తెలియజేస్తాను. మధ్యందిన మార్తాండుని వలె నా ప్రతాపం చూపించి శత్రువుల్ని మూర్ఛితుల్ని చేస్తాను. నేడారుద్రుడే ఎదురై నిల్చినా నన్ను నిరోధించలేడు" అన్నాడు.

## శల్యసారథ్యం :

దుర్యోధనుడి కోరికపై మద్రరాజైన శల్యుడు కర్ణుడికి రథసారథ్యం చేయటానికి అంగీకరించాడు. శల్యుడు నకులసహదేవులకు మేనమామ. కారణాంతరంవలన దుర్యోధనుడి పక్షంలో చేరినప్పటికి పాండవపక్షానికి వాక్సహాయం చేస్తానని ధర్మరాజుకు వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానప్రకారం యుద్ధరంగంలో కర్ణుణ్ణి తన శూలాల్లాంటి మాటలతో నిరుత్సాహపరుస్తుండేవాడు. పాండవుల పరాక్రమాన్ని పొగడుతూ కర్ణుని పరాక్రమాన్ని తెగడుతుండే వాడు. కర్ణునికి కలిగిన వివిధ శాపాలను జ్ఞప్తికి తెస్తూ కర్ణుణ్ణి నిరుత్సాహపరుస్తుండేవాడు. అయినప్పటికి కర్ణుడు తన మొదటిరోజు సైన్యాధిపత్యంలో పరశురాముని శాపానుగ్రహ ప్రకారం ఆనాడు శత్రు దుర్నిరీక్ష్యమైన ప్రతాపంతో ప్రకాశించాడు.



## అర్జునుని శపథం !

నాటి యుద్ధంలో ధర్మరాజు కర్ణుడితో యుద్ధంచేసి మూర్ఛిల్లాడు. తన తల్లికి చేసిన వాగ్దానం ప్రకారం కర్ణుడు ధర్మరాజును చంపకుండా విడిచి పెట్టాడు. ఆ తరువాత అర్జునునిపై యుద్ధం చేయాలని అతనికోసం వెదుకసాగాడు. ఆనాటి కర్ణుని ప్రతాపాన్ని చూచి కృష్ణార్జునులు కలతచెందారు. కర్ణుడు తమను వెతుక్కుంటూ రావటం చూచి కృష్ణుడు అర్జునుడితో "అర్జునా! ఇప్పుడీ కర్ణుడితో యుద్ధం చేయటమా? లేక వైదొలగి మన విడిదికి పోవటమా? ఏం చేద్దామో ఆలోచించి చెప్పు" అన్నాడు. దానికి అర్జునుడు "బావా! కర్ణుని పరాక్రమం నేడు ఎదుర్కొన శక్యం కాకుండా వుంది. అతని పరాక్రమానికి అసూయపడి వానిపై పోరాడి మనం అపాయం కొనితెచ్చు కోవటం మంచిదికాదు. చచ్చి సాధించేదేముంది? కార్య సాధకుడైనవాడు ఉపాయంతో అపాయాన్ని తప్పించుకొని, అనుకూలసమయంలో కార్యం సాధించుకోవాలి. బ్రతికుంటే



భోగాలు పొందవచ్చు. కాబట్టి నేటికి మన రథాన్ని శిబిరానికి మరల్చు" అన్నాడు. "ఇప్పటికింతకంటే క్షేమం లేద"ని చెప్పి కృష్ణుడు రథాన్ని యుద్ధరంగంనుండి మరల్చి శిబిరానికి చేర్చాడు.

కర్ణునిచేత మూర్ఛితుడైన ధర్మరాజు అంతకుముందే సూతుడిచేత శిబిరానికి చేర్చబడి సృహలోకి వచ్చివున్నాడు. శిబిరానికి చేరిన అర్జునుణ్ణి చూచి కర్ణుణ్ణి చంపి వచ్చాడనుకొన్నాడు. కాని కర్ణుడు చంపబడలేదని తెలిసికొని అర్జునుణ్ణి నిందించాడు. అన్నగారి నిందలకు కోపించిన అర్జునుడు 'కర్ణుణ్ణి చంపిగాని తిరిగిరాన'ని శపథం చేసి యుద్ధరంగానికి పార్థసారథితో పయనించాడు.

## కర్ణుడో, అర్జునుడో ఒక్కరే ఉండాలి :

కర్ణుడి సర్వసైన్యాధిపత్యంలో రెండవనాటి యుద్ధం ప్రారంభమైంది. పరశురాముని శాపకారణంగా కర్ణునికి తాను నేర్చిన విలువిద్య జ్ఞప్తికి రాలేదు. బుద్ధిమందగించసాగింది.



దానికితోడు శల్యాలవంటి సారథి శల్యుని సూటి పోటు మాటలకు కర్ణుడి మనస్సు వికలం కాజొచ్చింది. రథారూఢులైన కృష్ణార్జునులు యుద్ధరంగప్రవేశం చేసి కర్ణుడికి అభిముఖంగా నిలిచారు. అంతట అర్జునుడు కర్ణుణ్ణి చూచి ''కర్ణా! భారతయుద్ధారంభమై నేటికి పదిహేనురోజులైంది. మన యిద్దరిలో ఎవరో ఒకరు మరణించితే యింతకష్టం కలిగేది కాదు. సైనికులు, సారథులు, రథికులు, అందరు మిక్కిలి అలసివున్నారు. యుద్ధోత్సాహం ఉభయసేనల్లోనూ తగ్గింది. కాబట్టి యీ భూమి కర్ణరహితమో, కిరీటిరహితమో శీఘ్రంగా నిర్ణయింపబడటం మంచిది. నేడా పనిని నిర్వహించ పూనుకుందాం'' అన్నాడు. దానికి కర్ణుడంగీకరించాడు. కర్ణార్జును లిద్దరు ఘోరంగా యుద్ధం చేయసాగారు.

## రథచక్రాలు భూమిలో కృంగిపోయాయి :

కర్ణుడు తనవద్దనున్న శక్తిమంతమైన నాగాస్త్రాన్ని గుఱిచూచి అర్జునునిపై ప్రయోగించాడు. దాని శక్తి నెఱిగిన



కృష్ణుడు వెంటనే అర్జునుణ్ణి కారణం అడగకుండా తలవంచమన్నాడు. అట్లే తలవంచిన అర్జునుడి కిరీటాన్ని నేలకూల్చి నాగాస్త్రం విఫలమైంది. కాని అది తిరిగివచ్చి కర్ణుణ్ణి చేరి తనను మళ్ళీ అర్జునుడిపై ప్రయోగించమనింది. కర్ణుడు ఒకసారి వ్యర్థమైన నాగాస్త్రాన్ని మళ్ళీ ప్రయోగించటానికి అంగీకరించలేదు. అతనికి భార్గవ రాముని శాపం, బ్రాహ్మణ శాపాల వలన తాను నేర్చిన ఏ శస్త్రాస్త్ర మంత్రాలు జ్ఞప్తికి రాకుండా పోయినై. అదే సమయంలో కర్ణుడి రథచక్రం భూదేవి శాపకారణంచేత పుడమిలో క్రుంగిపోయింది. రథం కదలలేకుండా పోయింది. అది తెలిసికొన్న కర్ణుడికి భూదేవి శాపం, భార్గవ, బ్రాహ్మణ శాపాలన్నీ గుర్తుకు వచ్చి, నిరుత్సాహం కలిగి, మనస్సు వికలమైంది. అయినప్పటికి ధీరుడైన కర్ణుడు నిరుత్సాహపడక రథం నుండి దిగి రథచక్రాన్ని పైకెత్తసాగాడు. కాని కర్ణుడు దాని నెత్తినకొద్దీ అదిమరింతగా భూమిలోకి క్రుంగిపోసాగింది. అది చూచి కర్ణుడు తనలో ''అయ్యయ్యో!



నేను నేర్చిన బ్రహ్మాస్త్ర భార్గవాస్త్రాలు జ్ఞప్తికి రావటంలేదు. భార్గవ, భూసుర, భూదేవి శాపాలన్నీ ఈ సమయంలో నాపై పని చేయసాగినై. సర్పముఖాస్త్రం వ్యర్థమైంది'' అని చింతిస్తూ రథచక్రం పైకెత్తసాగాడు.

## కృష్ణా! నీవు చేయించేపని అధర్మం :

ఆ సమయంలో బాణప్రయోగం చేయడానికి కృష్ణుడు అర్జునుణ్ణి ప్రేరేపించాడు. కాని నిరాయుధుడైన కర్ణుణ్ణి చంపటానికి అర్జునుడు వెనుకాడజొచ్చాడు. అజేయుడైన శత్రువు చేజిక్కినప్పుడు ధర్మాధర్మ విచక్షణ కూడదని చెప్పి కృష్ణుడు, అర్జునుణ్ణి బాణప్రయోగం చేసి కర్ణుణ్ణి తత్క్షణం చంపమని త్వరపెట్టసాగాడు. అదివిని కర్ణుడు కోపంతో ''కృష్ణా! నీవు చేయించే పని అధర్మం. మీరు రథస్థులు. నేను విరథుణ్ణి, నేలపైనున్నాను. ఇంతవరకు సమయుద్ధ చతురులన్న పేరు గన్నారు. నేడీ అధర్మకార్యం వల్ల కలిగే దుష్కీర్తి కలకాలం



నిల్చిపోతుంది. శాపపీడితుడనై రథచక్రం భూమిలో క్రుంగిన ఈ దుష్కాలంలో ధర్మబుద్ధిగల పార్థుణ్ణి ప్రోత్సహించి అధర్మంగా నన్ను చంపటానికి పాపపు బండి త్రోలటం నీకు తగదు. ధర్మాధర్మాలు బాగా విచారించు. నేనేమీ అసమర్థుణ్ణికాను. చక్రాన్ని సరిచేసుకోనివ్వు. పిమ్మట మన మన శక్తులు పరీక్షించుకోవచ్చు'' అని కృష్ణునితో అన్నాడు.

## ఇప్పుడా ధర్మాధర్మ విచారం?

కర్ణుని మాటలువిని కృష్ణుడు '' ఏమిటేమిటి? కర్ణా! ధర్మాధర్మాలు విచారించి చేయాలా? ధర్మమనే మాట పలకటానికి నీ నాలుకకు అధికారం వుందా? పాండవులను లక్కయింటిలో పెట్టి తగులబెట్టించినప్పుడా ధర్మాధర్మ విచారమేమైంది? మాయజూదంలో ధర్మరాజునోడించి, పాండవుల సకల సంపదలు అపహరించి, అడవులకు పంపి, నానా కష్టాలపాలు చేసినప్పుడు ధర్మాధర్మ విచారమేమైంది? పతివ్రతయైన ద్రౌపదిని కొప్పుపట్టి, నిండుసభ కీడ్చి తెచ్చి,

వస్త్రాపహరణం చేయించిన నాడీ ధర్మాధర్మ విచారమేమైంది? బాలుడైన అభిమన్యుని ఒంటరిగా చేసి పలువురు రథికులు చుట్టు ముట్టి, అధర్మంగా చంపినప్పుడు ఆ ధర్మాధర్మ విచారమేమైంది? ఈ పాపకార్యాలన్నింటికి ప్రోత్సాహాన్నిచ్చి, దుర్యోధనుడితో చేయించింది నీవు కావా? అట్టి నీ గురించి ఇప్పుడు ధర్మాధర్మాలు విచారించాలా?" అని కర్ణుడితో పలికి అర్జునుణ్ణి చూచి "పార్థా! నీ వాలస్యం చేయవద్దు. కౌరవులు మన యెడలకావించిన అధర్మాల్లో యిది ఎన్నోవంతు? ఈ సమయంలోనే పాపియైన ఈ కర్ణుణ్ణి సంహారం చేయాలి" అని హెచ్చరించాడు.

## నీ పేరు కూడా తలచకూడదు :

అదివిన్న కర్ణుడు మిక్కిలి కోపంతో కృష్ణుణ్ణి చూచి "ఓ కపటీ! దామోదరా! నీ వల్లనే మాకింత కీడు కలిగింది. కఠిన కపటాత్ముడవైన నీవు కురుపాండవుల మధ్య కలహం పెంచకుంటే యీ యుద్ధం జరిగేదే కాదు. గోముఖవ్యాఘ్రం



వలె నీవు పాండవులచేత యెన్నెన్ని అధర్మకార్యాలు చేయించలేదు? సిగ్గు యెగ్గు విడచి ధర్మాన్ని గూర్చి మాట్లాడుటెందుకు? కపట బుద్ధితో యుద్ధంలో ఆయుధం ధరించనని మొదట ప్రతిజ్ఞచేసి కూడా చక్రం ధరించి భీష్మణ్ణి చంప యత్నించావు. శిఖండిని అడ్డు పెట్టుకొని ఆ భీష్మణ్ణి అంపశయ్యాగతుణ్ణి చేయించావు. ధర్మం తప్పని ధర్మరాజుతో అబద్ధ మాడించి, ద్రోణుణ్ణి కూలగొట్టావు. విదురునింట విందారగించి సంధి చెడ గొట్టావు. అర్జునుణ్ణి దూరంగా తొలగించుకు వెళ్ళి, అభిమన్యుని అసహాయుణ్ణి చేసి నీవే చంపించావు. సూర్యాస్తమయం జరిగిందని అబద్ధమాడి సైంధవుణ్ణి చంపించావు. ఇప్పుడు రథచక్రం భూమిలో క్రుంగి నేలపైనున్న, నిరాయుధుడనై నన్ను, యుద్ధం చేయటానికి సిద్ధంగా లేని నన్ను చంపించ చూస్తున్నావు. ఛీ! ఛీ! ఇంతమాత్రం చేతనే పరాక్రమశాలి వౌదువా? పిరికిపందా! జరాసంధునిచేత ఎన్నిసారులు ఓడింపబడి పారిపోయావో



మరచావా? పుట్టింది మొదలుకొని విష్ణులీలలనుపేర గొల్లపడుచుల్ని చేపడుతూ, వారి యిండ్లలో పాలు, వెన్నలను దొంగిలించి మెక్కిన దొంగవు, దుర్బుద్ధివి, ఛీ! నీ పేరు కూడా తలచరాదు" అని కర్ణుడు కృష్ణుణ్ణి నిందించాడు.

## ఈ వివాదం తెచ్చిపెట్టింది నీవే :

అది విన్న కృష్ణుడు "కర్ణా! నేనేమన్నా అధర్మకార్యాలు చేయిస్తున్నానా? ధర్మాత్ములైనందుననే ధర్మరాజాదులు అధర్మపరులైన మీ కౌరవపక్షీయుల్ని సంహరించగలుగు తున్నారు. ధర్మప్రకారం రావలసిన రాజ్యభాగం మీ దుర్యోధనుడివ్వనందుననే క్షత్రియధర్మప్రకారం యుద్ధం చేసి, సమస్త సామ్రాజాన్ని గెల్చుకోనున్నారు. ఇందులో నేను చేయిస్తున్న అధర్మమేముంది? నా కపటమేముంది?" అని కర్ణుడితో అన్నాడు. అది విని కర్ణుడు " ఏమీ! దుర్యోధనాదులు అధర్మపరులనే భావపిశాచం యింకా నిన్ను విడువలేదా? ఓయీ! కపటతంత్రవిశారదా! కౌరవపాండవుల్లో ఎవరు



ధర్మాత్ములు? నేతి బీరకాయలో నెయ్యి యెంతున్నదో మీ ధర్మరాజునందంత ధర్మముంది. అసలెవ్వడీ ధర్మరాజు? రాజ్యభాగానికై తగవులాడటానికి తనకున్న అధికార మేమిటి? నిరాధారమైన యీ దాయభాగ వివాదం తెచ్చిపెట్టింది నీవే కదా! ఇక నిస్సహాయుడనైన నన్ను యెట్లాగూ నీవు బ్రతకనీయవు. చావనున్నాను. నా క్రోధం వెడలగ్రక్కేచస్తాను. నీ దాయభాగపు దుర్వాదాన్ని ఖండిస్తున్నాను, విను.

## కర్ణుడు కృష్ణుణ్ణి నిరుత్తరుణ్ణి చేశాడు !

కురువంశంలో పుట్టిన జ్యేష్ఠుడు, రాజ్యాధికారి ధృతరాష్ట్రుడు. ఈ రాజ్యం ధృతరాష్ట్రునిదేగాని పాండురాజుది కాదు. ఒక విధంగా పాండురాజుకు అర్ధరాజ్యం రావాలను కొన్నప్పటికీ, వైద్యశాస్త్ర విధిననుసరించి పాండురోగికి రాజ్యాధి కారం లేదే! దానిననుసరించి ఆ పాండురోగి కుమారులకును రాజ్యాధికారం లేదు. అది అట్లుండనీ. అసలీ పాండు రాజెవ్వడు? పాండవు లెవ్వరు? కురురాజ్యమెట్లు పంచుకొన

తగును? కుంతి యమునికొకని, గాలి కొకని, ఇంద్రునికొకని కన్నంతనే ఆ కులటాసుతులకు, కురుకులంలో పుట్టని వారికి, రాజ్యమివ్వాలా? కృష్ణా! మరియొక మాట. రాజనీతివేత్తయైన దుర్యోధనుడు పదమూడేళ్ళు పాండవుల్ని ప్రవాసుల్ని చేసాడు. పన్నెండేళ్ళు దాటిన తరువాత ఈ భూమిపైన యెవ్వరికైనా అధికారముంటుందా? కాలదోషం పట్టదా? పదునాల్గవయేట, కాలదోషం పట్టిన రాజ్యానికై పాండవులు తగవుకు రావటం కేవలం అధర్మంకాదా? తగుదునని రాయబారం చేయవచ్చిన నీవా ధర్మవేత్తవు? ప్రపంచజ్ఞానం కొంచెమైనా లేని భూస్వామినడిగి చూడు. ఇది అన్యాయమని ఆలోచన అవసరం లేకుండా చెపుతాడు. పెద్దవాడైన ధృతరాష్ట్రుడు బ్రతికుండగా అతని కుమారులు రాజ్యమేల తగరట! ఎవరికో కుంతికన్న అనామకులు, పేరుకు మాత్రమే పాండురాజు పుత్రులైన పాండవులకు దాయభాగమట! వెఱ్ఱి గొల్లడవైన నీకు రాజకీయమేమి తెలుసు! ఛీ! ఛీ! నీ వల్లనే కదా యీ కల్లోల మంతా కలుగుట!" అని ములుకుల్లాంటి పలుకులతో కర్ణుడు



కృష్ణుణ్ణి నిరుత్తరుణ్ణి చేశాడు. అది విని కోపించిన శ్రీకృష్ణుడు "పార్థా! వీని ప్రేలాపన నీ బాణాల చేతనేగాని నా మాటలచేత కట్టుబడదు. వేగిరపడి వీనిని నేలగూల్చు!" అని గట్టిగా హెచ్చరించగా అర్జునుడొక వాడిబాణంతో కర్ణుణ్ణి నేల గూల్చాడు. కర్ణుడు నేలగూలి బాణపుదెబ్బ బాధకు అటునిటు పొర్లసాగాడు.

## ధర్మజునితో తిలోదకాలిప్పించు!

ఆ సమయంలో కుంతి కడు దుఃఖంతో కర్ణుని వద్దకు వచ్చి "నాయనా! కర్ణా! నా తండ్రీ! నిన్నీ అవస్థలో చూస్తాననుకోలేదు నాయనా! నా బిడ్డలంతా చల్లగా వుంటే చూడాలని సంబరపడ్డాను. కాని దైవం నాకడుపున చిచ్చు పెట్టాడు" అని దుఃఖించసాగింది. అది విని కర్ణుడు "అమ్మా! నీ మనస్సులో నిజంగా అటువంటి ఆలోచన ఉందా? ఉంటే పసిగుడ్డుగా నున్న నన్ను గంగలో పారవేయగలవా? ఇంద్రుణ్ణి ప్రోత్సహించి నా కవచ కుండలాలను అపహరింపజేయటం



దేనికి? అర్జునునిదప్ప అన్యపాండు పుత్రుల్ని యెవ్వరిని చంపనని నాచేత బాస చేయించుకోవటం దేనికి? నీ కుటిలబుద్ధినంతా వెల్లడించుకున్నావు. నీవే లేకపోతే నాకీ దుర్గతి యెందుకు కలుగుతుంది. మీరంతా యేకమై నన్ను అన్యాయంగా చంపించారు. కానివ్వండి! మీకు రాగల కీర్తి, నాకు రాగల అపకీర్తి నా మరణానంతరం లోకమే నిర్ణయించ గలదు. వెళ్ళు! వెళ్ళు! నీవు నాకై విచారించవద్దు. నా తుది గడియల్లో నన్ను నిశ్చింతగా చావనీ!! నీకు నిజంగా నాయందు ప్రేమవుంటే ధర్మజునితో నాకు తిలోదకాలిప్పించు. మన సంభాషణ యితరులు వినకూడదు. అదిగో యెవరో యిద్దరు ఈ వంకకే వస్తున్నారు. కాబట్టి వెంటనే యిక్కడినుండి వెళ్ళిపో అమ్మా!" అని దీనంగా ప్రార్థించాడు.

అది విని కుంతి కుమిలి కుమిలి దుఃఖిస్తూ అక్కడ నుండి వెళ్ళిపోయింది. కుంతివెళ్ళిన పిమ్మట కర్ణుడు శరబాధచేత పీడింపబడుతూ కండ్లుమూసుకొని, నిశ్చలంగా భగవద్ధ్యానం చేయసాగాడు.



## అతని మాటలు వేదాక్షరాలు :

కర్ణుణ్ణి కూల్చి శిబిరానికి తిరిగివచ్చిన కృష్ణార్జునులలో కృష్ణుడు విచారంగా వుండటం చూచి అర్జునుడు కారణం అడిగాడు. కృష్ణుడు కర్ణుని ములుకుల్లాంటి పలుకులే కారణమన్నాడు. "దుష్టుడైన కర్ణుని ప్రేలాపనలకు నీవు విచారింప నవసరం లేద"ని అర్జునుడు కృష్ణునితో అనగా కృష్ణుడు "అర్జునా! తప్పు, తప్పు! కర్ణుడు దుష్టుడని పలుకబోకు. అతడు మరణ కాలంలో మాట్లాడిన మాటలన్నీ కూడా వేదాక్షరాలని నమ్ము. అతడాత్మ గౌరవాన్ని నిలుపుకొన్న మహాత్ముడు. మనవంటివారు ఆ ధర్మాత్ముని ముందు నిలువలేము" అన్నాడు. అంతటి ధర్మాత్ముణ్ణి ధర్మదేవత యెందుకు రక్షింప లేకపోయిందో అని అర్జునుడు హేళనగా పలికాడు. అది విని కృష్ణుడు "అర్జునా! ధర్మదేవత అతణ్ణి రక్షింపలేకపోవటానికి మన శౌర్యం కారణం కాదు. పలుశాపాల చేత కర్ణుడు పడిపోయాడు. ఇది విను.

**"నీ చేతను నాచేతను**
**వరమడిగిన కుంతిచేత వాసవుచేతన్**
**ధరచేత శల్యుచేతను**
**అరయంగా కర్ణుడీల్గె నార్గురచేతన్"**

ఇవికాక పరశురామ, బ్రాహ్మణ శాపాదులు బలవత్తరాలై అతని పతనానికి తోడుపడినై. నీకు నిదర్శనం చూడాలని వుంటే మనం సాధువుల రూపంలో కర్ణుడున్న తావుకు వెళ్ళిచూద్దాం. కర్ణుడి ప్రాణాలు సూర్యాస్తమయం దాకా పోవు" అని చెప్పి కృష్ణుడు అర్జునుణ్ణి వెంటబెట్టుకొని, సాధువుల వేషంలో యుద్ధరంగంలో కర్ణుడు పడియున్న చోటుకు వెళ్ళారు.

## నీ అంతటి పుణ్యాత్ముడు లేడు :

కృష్ణుడు కర్ణుణ్ణి పరీక్షించటానికై అతడిని సమీపించి "దానకర్ణా! దానము! దానము!! నిన్ను అర్థింపవచ్చాం" అన్నాడు. కర్ణుడు కండ్లుతెరచి "ఆహా! కృతార్థుణ్ణి! కృతార్థుణ్ణి!



మరణసమయంలో కూడా నాకు దానఫలం కలిగింప వచ్చిన మీ కోరిక యేమో తెల్పండి" అని వారి నడిగాడు. కృష్ణుడంతట "మాకు సువర్ణదానం చేయగోరుతున్నాం" అన్నాడు. కర్ణుడు వారి కోరిక విని "నానోట యింతవరకు లేదను మాట రాలేదు. గతిలేని స్థితిలో పడివున్న నా వద్ద యిప్పుడొక సువర్ణదంతము మాత్రమే వుంది. ఆ దంతాన్ని దానం చేస్తాను - స్వీకరించి తృప్తిపడి నన్నాశీర్వదించండి!" అని తన సువర్ణదంతం లాగి వారికి ఇవ్వజూపాడు. "బ్రాహ్మణులకు సూతుని యెంగిలి సువర్ణ దానమా?" అని వారు దానిని తిరస్కరింపగా కర్ణుడతికష్టం మీద శరసంధానం చేసి భూమినిగొట్టి, పాతాళగంగా జలంతో తన సువర్ణ దంతాన్ని శుద్ధిచేసి, వారికి దానమిచ్చి "సాధుపుంగవులారా! మరణకాలంలో కూడా భూసురులకు దానంచేసి సంతృప్తినొందాను. నాజన్మ ధన్యమైంది" అని పలికిన వెంటనే కృష్ణార్జునులు తమ సాధువేషాలు విడిచారు. అపుడు కృష్ణుడు కర్ణునితో "పూజనీయుడవైన పరిపూర్ణధన్యజీవీ!



ఓ కర్ణా! పధ్నాలుగు లోకాల్లోను నీ యంతటి పుణ్యాత్ముడు లేడు. నీ దానగుణం సమస్తమైన వారి మెప్పును పొందింది. నీ ప్రత్యర్థి అర్జును డిడుగో చూడు. నీ దానగుణం పరీక్షింప దలచాడు. అందుకే యీ నాటకమాడినాం. మహానుభావా! నిన్ను చంపటానికి మాకెవ్వరికి శక్తిచాలకే నిన్ను మోసంతో కూలగొట్టాం. మేము పాపం చేశాము. దాన, వీర, శూర కర్ణుడనే ఖ్యాతి నీకు కలుగుగాక!! నీ శత్రువు అర్జునిడిదే తలవంచియున్నాడు. మా తప్పులు మన్నించు" అన్నాడు.

## పవిత్ర స్థలంలో నన్ను దహనం చెయ్యి :

అది విని కర్ణుడు "కృష్ణా! హే జగద్రక్షకా! అజ్ఞానంచేత తెలియక పరమాత్ముడవైన నిన్ను నిందించాను. నా సమస్తాపచారాలను మన్నించు. అర్జునా! విజయుడవను పేరు ఇప్పుడు నీకు సార్థకమైంది. శత్రుశేషాన్ని సంహరించి సమస్తరాజ్యాన్ని యేలుకో! నా ప్రాణాలింక నిలువవు" అన్నాడు.



అర్జునుడు వినయంతో తన తప్పును మన్నింపుమని వేడుకొన్నాడు. కర్ణుడాతణ్ణి అనుగ్రహించి "శ్రీకృష్ణా! నా పాపాలు పోయేటట్లు నన్ననుగ్రహింపు" మన్నాడు. శ్రీకృష్ణుడు "నీకేమి కావాలో కోరుకో" మన్నాడు. అంతట కర్ణుడు "హే కృష్ణా! సర్వభోగాలు అనుభవించాను. నాకే కోరిక లేదు. ఈ నీచ ప్రదేశంలో గతిలేని మరణం పొందనున్నాను. నా దహనానికి వంశాంకురమైనా లేకుండా పోయింది. పావనమైన ఏదైన ఒక పవిత్రస్థలంలో నన్ను దహనం చెయ్యి. ఇదే నా కోరిక" అన్నాడు. శ్రీకృష్ణుడాతణ్ణి అనుగ్రహించి సూర్యాస్తమయముతో పాటు తనప్రాణాన్ని వీడిన కర్ణుడి దేహాన్ని తన హస్తతలంపై నుంచి దహనం చేయగా కర్ణుడు విష్ణుసాయుజ్యాన్ని పొందాడు.

## కర్ణుని ఆత్మశక్తి :

"కర్ణుని తల భారతం" అనే నానుడి, భారతగాథకు కర్ణుని ప్రాధాన్యతను వెల్లడిస్తుంది. ఉత్తమ కులంలో

వరపుత్రుడుగా పుట్టి, వెంటనే తల్లి ప్రేమకు దూరమై, బాల్యం నుండి అడుగడుగునా తన ఆత్మగౌరవం దెబ్బతిని, అవమానాల పాలౌతున్నా, తనవిషయం తెలిసుండి కూడా పెంచిన వారి ప్రేమను విడువలేక, వారియందలి కృతజ్ఞతా భావంతో, వారి బిడ్డగనే తుదివరకు జీవితం గడపటం కర్ణుని విశ్వాసాన్ని, కృతజ్ఞతాభావాన్ని వెల్లడిస్తుంది. నిండుసభలో అవమానానికి గుఱియైన తనను గౌరవించి, రాజుగా చేసి, ప్రాణమిత్రునిగా పరిగణించిన రారాజు దుర్యోధనునియెడ ఆజన్మాంతం కృతజ్ఞతాపూర్వక విశ్వాసపాత్రుడై మెలగి, తుదకు తనప్రాణాలను సైతం మిత్రుని కొఱకై ధారపోసిన కర్ణుని ఉదాత్తగుణం వర్ణింప శక్యంగానిది. కృతజ్ఞతా ప్రదర్శకత్వంలోని కర్ణుని గంభీర హృదయం, పాండవ జ్యేష్ఠునిగా తన్ను పట్టాభిషిక్తుని జేసి, సుందరాంగి ద్రౌపది కారవభర్తగా చేయగలనని ఆశ జూపిన శ్రీకృష్ణుని పలుకులు విని, విశ్వాసప్రధానమైన రాజభక్తితో రాజ్య, రమాభోగాలను తృణప్రాయంగా తృణీకరించిన కర్ణుని



ఆత్మశక్తి, గంభీర హృదయం యెన్నివిధాల వర్ణించినా తనివితీరదు.

## త్యాగానికి మారుపేరు కర్ణుడు :

నిరంతర దానవ్రతుడై, తన దానవ్రతాన్ని ఆధారం చేసుకొని తనను కవచకుండలాలు యాచింప వచ్చిన దేవేంద్రునకు, ఆ విషయం ముందే తెలిసుండి కూడా, తన ప్రాణాపాయాన్ని సైతం లెక్కింపక, తన కవచ కుండలాలను నిర్వికార బుద్ధితో దానం చేసినట్టి త్యాగశీలి. పాలిచ్చిపెంచి, తల్లి ప్రేమను తనకు పంచకపోయినా, కన్నతల్లిగా తన్ను యాచింపవచ్చిన కుంతిని తల్లిగా గౌరవించి, ఆమె కోరిన వరాన్నివ్వటం, భీకరసంగ్రామ రంగంలో, ప్రాణాపాయ సమయంలో కూడా తల్లికి తానిచ్చిన వరాన్ని పాటించి, చేతికి చిక్కిన పాండవులను చంపక విడువటం అతని సత్యనిష్ఠను, దానవ్రతదీక్షను వెల్లడిస్తుంది. ఇటువంటి ఉదాత్త



గుణపరిపూర్ణుడు, ఆదర్శ పురుషుడు నిత్యస్మరణీయుడు కర్ణుడు. ఆతని సుగుణాలు భావిభారత పౌరులుగా నున్న బాలబాలికలకు అవశ్యం ఆచరణీయాలు, శిరోధార్యాలు.

\- - -